28వ పూజా పుష్పము

# మురళీ స్వనాలు

(లలిత గీతాలు)




రచన :

పి. దుర్గారావు యం.ఓ.యల్.

ప్రథమ ముద్రణము : 500 ప్రతులు

సర్వసామ్యములు రచయితవి.

అంగీరస నామ సంవత్సరము

హేమంతము. మార్గశీర్షము.

1993 సంవత్సరము జనవరి.

మూల్యము : ఎనిమిది రూపాయలు

ముద్రణము : డి. బి. ప్రింటర్స్. విజయవాడ-2

---

ప్రతులకు : పి. దుర్గారావు, యం.ఓ.యల్.
చెరుకుపల్లి పోస్టు, కేతేపల్లి మండలం,
నల్లగొండ జిల్లా.

# పూజాపుష్పం :

అహో! నా సౌభాగ్యం!
మధుర మధురం నీదు మురళీ
స్వరాలన్ విన్పింపన్
తపమున మదిన్ దాసి నయితిన్!
సరాగాలన్ జిందీ
మధుర పదముల్ బాడితిన్ నే
విలాసంబౌ గోపీ
వనిత నయితిన్ మంజులముగా!

విలోకింపన్ నీవే!
యణువణువునూ! సర్వ జగతిన్
భరించీ కాపాడే
పరమ పురుషా! భక్తవరదా!
నినున్ జేరన్ గాదా!
విరిసినవి నా మానసమునన్!
ఇదే! గైకొమ్మా! నా
విమల సురుచీ భక్తి సుమముల్

# సమర్పణ

ఎన్ని మాటలు పాడినా
వన్నె తరుగదు నీ పాటకు!
ఎన్ని మాటలు విన్నా నీ మురళీ స్వనాలకు
వన్నె లేమి తరుగవు గదా!

మరిచి పోవాలన్నా మాధవా!
మరుపురాదు నీ పేరు!
విడిచి బోవాలన్నా వీడిపోదు
విడివడని బంధమిది యేనాటిదో!

తీయని నీ గీతం
తీపిదనం కురిపిస్తుందెప్పుడూ
నర్తన జేస్తుందెప్పుడు నా యెదలో
నవ్య సుందరములను వెలువరిస్తూ!

అందుకే అర్పిస్తున్నా!
ఆత్మార్పణమని
ఆవేదనతో నా మధుర గీతాలను!
యుగయుగాల నాటి నీ మధుర పదాలు!
తరతరాల నాటి దీ హృదయావేదన!

# వినయ వాక్యము

'మురళీ స్వనాలు' అను కృష్ణభక్తితో కూడిన లలితగీతాల పుస్తకము ఇరువది యెనిమిదవ పూజా పుష్పముగా తెలుగు సాహితీ సరస్వతీ శ్రీ చరణాలకు భక్తితో సమర్పించుకొనుచున్నాను.

కృష్ణభక్తితో కూడిన యీ లలిత పదాలను ఉపాధ్యాయవృత్తిని నిర్వహించుకొనుచు నప్పుడప్పుడు వ్రాసికొనినవి.

మధుర భక్తితో మనోహరముగా పాడుకొనిన మీరాబాయి భక్తి గీతములు, కీ.శే. దేవులపల్లి కృష్ణశాస్త్రిగారి మధురగీతములు నా యీ లలిత గీతములకు ప్రేరణయని చెప్పవచ్చును.

ఇదివరలో వ్రాసిన లలిత గీతములను ప్రశంసించుచు వ్రాసిన ప్రముఖులకు నా హృదయపూర్వక నమస్సుమాంజలులు!

ఇందుగల డెబ్బదిరెండు పాటలను పాడుకొనుటకు వీలుగా లలిత పదములతో గూర్చితిని. రసహృదయులను ఈ గీతములు ఏ మాత్రము స్పందింపజేసినను ధన్యురాలిగా భావించుకొందును.

—రచయిత



# మాతృ వందనము

ఓహో! నా జన్మభూమి! ఓహో! నా మాతృభూమి!
ఓహో! నా కన్నతల్లి! వందన మిదె ప్రియ భారతి!
ఓహో! నాజన్మభూమి! ఓహో! నా మాతృభూమి!

సకలసస్య శ్రీనిలయిని! సాధుమార్గ శుభదాయిని!
సర్వలోక జనపూజిత! సామగాన సురభాషిణి!
సకలధర్మ సహజీవన సంస్కృతి విలసిత శోభిని!
పుణ్యకర్మ సువిరాజిత పూర్ణకలా తేజోమయి!

ఓహో! నా జన్మభూమి! ఓహో! నా మాతృభూమి!
ఓహో! నా కన్నతల్లి! వందనమిదె! ప్రియభారతి!

గంగయమున కృష్ణవేణి-కావేరీ తుంగభద్ర!
ఉన్నత హిమగిరిశిఖరము--రొప్పెడు శుభ కల్యాణి!
అడుగడుగున పుణ్యభూము - లమరు విమల సౌమ్యమూర్తి!
మధుర కావ్యగేయ శిల్ప - మంజుల తర శివగాయిని!

ఓహో! నా జన్మభూమి! ఓహో నా మాతృభూమి!
ఓహో! నా కన్న తల్లి! వందనమిదె! ప్రియభారతి!

సత్యము శివ సుందరములు సర్వదిశలు విలసిల్లిన
ఈ సుందర దివ్యభూమి! ఈ పవిత్ర పుణ్యధాత్రి!
నీ స్వరూప విలసనమే! నీ యనంత దర్శనమే!
అమ్మా నీ యాశీస్సులు నలరి వేడుచుంటి నమ్మ!

ఓహో! నా జన్మభూమి! ఓహో నా మాతృభూమి!
ఓహో! నా కన్నతల్లి! వందనమిదె ప్రియభారతి!
ఓహో! నా జన్మభూమి ఓహో! నా మాతృభూమి!

# మధుర మురళి

మధురమురళి మ్రోయింపుము!
మాధవ! మది జిగురు లీన!

తీయని నీ మురళీ స్వన
తేనెలలో దేలిపోదు!

మధుర మురళి మ్రోయింపుము
మాధవ! మది జిగురు లీన!

విరహ వేదనల నన్నిటు
వేధింపకు చాటు నిలిచి!
కనుల ముందు నిలిచి నాదు
కాంక్ష దీర్ప లేవటోయి!

జన్మ జన్మలిటుల నేను
మర్మములను దెలుపలేను!
అందింపుము నీదు మురళి
యాత్మ సుఖము నందకృష్ణ!

మంచు బిందువులకు బోలె
మానస పద్మమున దొలుకు!
వేదనా స్రవవులను బాపు
వేణువు నొకసారి యూది!

వెన్నెల విరిసిన రాత్రిని
వన్నెలు జిందిన పూలివె!
కన్నె మనసు జేర దీసి
కనికరింప లేవటోయి!

# సన్నని నీ మురళీరవ

సన్నని నీ మురళీరవ
సరసమైన రాగములను!

వినుచుందును హాయముగా
విమలమైన స్వనములలో!

సన్నని నీ మురళీరవ
సరసమైన రాగములను!

నింగి నీలి తారలలో
నిర్మలమగు వెన్నెలలో!
నీ మురళీ నాదములే
నే వింటును చోద్యముగా!

జాలువారు సెలయేటిని
జల జల ప్రవహింపు నలల
నీ మురళియె ధ్వనియించును
నిజమో! మఱి భ్రమయేమో!

నా మాటలు నా తలపులు
నవ్యరాగ గీత మగును!
నా మదిలో నిండిపోయి
నాట్యమాడుదువు నిరతము!

ఎన్నాళ్ళిటు దోబూచులు
ఎన్నాళ్ళిటు దాగుమూత?
అంతరంగమును జేకొని
ఆత్మసుఖము నిమ్ము కృష్ణ!

# పరవశమగు నా పాటను

పరవశమగు నా పాటను
పరువుత్తెత్త నిమ్ము కృష్ణ!
దివిని భువిని యల్లుకొనీ
దివ్య సుఖము లంద నిమ్ము!

పరవశమగు నాపాటను
పరువు లెత్తనిమ్ము కృష్ణ!

ఏ తావున నీ వుందువొ!
యాతావున నే నుందును!
మధుర గాన మొనరింపగ
మాధవ నను గరుణింపుము

ఆకాశపు టంచులందు
అరుణకాంతి చిగురులందు!
తారల చిరుకాంతులలో
తన్మయమై పాడనిమ్ము!

మబ్బుపొరల దాగి యుండి
మధురమైన జలధారల!
ధరణి బడుచు నిను జూడగ
ధన్యుడ నను గావింపుము!

నీదుమురళి యెటు మ్రోగునొ
నేనుందును గీతి తోడ!
విడువని యీ నీడ నెప్పుడు
వీక్షింపుము కరుణతోడ!

# అంతులేని యావేదన

అంతులేని యావేదన
ఎటులని యెవరికి తెలుపనులే!

మధురమైన గీతముతో
మాధవ! నే దెలుపుదులే!

అంతులేని యావేదన
ఎటులని యెవరికి తెలుపనులే!

చుక్కలవలె యెన్నెన్నో
చోద్యమైన భావములను!
వినిపించను! వినిపింతును
వేడుకగ నొక మర్మ గీతి!

పొంగారుపు జలధారగ
పైకి లేచు కన్నీటిని!
ముత్యములుగ నొకటొకటిగ
మురిపెములుగా నొలుకుదులే!

పొగల సెగల జ్వాలలతో
పొరలుచున్న నాదు మదిని!
పైకి పొగల నివ్వనులే!
పలికెద నొక మధుర గీతి!

పోటులెత్తు జలధి వోలె
మారుమ్రోగు నాదు మదిని!
తేట తెలుగు పదములతో
తెలిపెద నొక శ్రావ్య గీతి!

# మనసునందు నిలిచి నీవు

మనసునందు నిలిచి నీవు
మాధుర్యము నొలుకుచుండ!

వెదుకు చుంటి యూరు బయట
వింత గాద! గోపాలా!

మనసు నందు నిలిచి నీవు
మాధుర్యము నొలుకుచుండ!

మేఘములో మెఱుపులలో
మెఱయు సంజ కాంతులందు!
మనసు నందు నిను గాంచక
మధురమూర్తి! వెదుకుచుంటి!

చుట్టు లాగు హృదయములో
సుందరముగ నిలిచి యుండ!
అలసి సొలసి యచట నిచట
యడవు లందు వెదకు చుంటి!

పూవు నందు తావి లాగు
పూర్ణ హృదిని దగిలి యుండ!
మధు పము వలె వెదకు చుంటి
మారు మూల తరుల నీడల!

నాలో పల నీ నాట్యపు
నర్తన మును గాంచ లేక!
అంబుధిలో యలల వోలె
యడలు చుంటి! నీ కోసము!

# సుడుల యందు దిరుగు చున్న

సుడుల యందు దిరుగు చున్న
సుందరమగు నా నౌకను!

ఆ దరి నిక జేర్చు కృష్ణ!
యాలస్యము జేయ కోయి!

సుడుల యందు దిరుగు చున్న
సుందర మగు నా నౌకను!

గమ్య మేదు! గమన మెటకొ!
కనికరించి తెలుప వోయి!
అలల తెరల సుడి గాలుల
యణగి పోక వెడల నిమ్ము!

నావ నడుపు వాడు లేడు
నావకు చుక్కాని లేదు!
దారి డొంక లేని పడవ
దరిని జేర్చి కాపాడుము!

తెల్లని తెర చాప నెత్తి
చల్లని యా గాలి తెరల!
మెల్లగ నా నావ నడిపి
యుల్ల మలర మురళి నూదు!

అంధ కార బంధు రమున
అదిరి బెదిరి పయనించే!
నావ గమ్యమును జేర్చుము!
నను నీలో జేర్చుకొనుము!

# చిత్ర మొకటి వెలసినదీ

చిత్ర మొకటి వెలసినదీ హృదయంలో!
అది యెవరిదో కాదోయి! నీదే కృష్ణా!

అది నీవే కృష్ణా! అదీ నీదే కృష్ణా!
సుందర మగు నగు మోమున

నుదు చిరమగు పింఛముతో!
పిల్లన గ్రోవిని యూదుచు

మెల్లన నాట్యము జేసే!
జన్మ జన్మముల నుండీ
జాలు వారు భక్తి తోడ!
నే నిలిచిన యా రూపమె

నిలిచినదీ శిల్పముగా!
మనసు నందు నిలుచు వేల
మధుర మురళి నూదు వేల!
కనుల ముందు నిలువ రాద?

కాంక్ష నాదు దీర్ప రాద?
జ్యోతిని జ్యోతిని గలుపుచు
ప్రీతిని నీ యెదను జేర్చి!
నీ మురళీ రవములలో

నే నొక రవమై పోవగ!
చిత్ర మొకటి వెలసినదీ హృదయంలో!
అది యెవరిదో కాదోయీ! నీదీ కృష్ణా!
అది నీదే కృష్ణా! అది నీదే కృష్ణా!

# ఎందుకో నా వీణ మ్రోగదు

ఎందుకో నా వీణ మ్రోగదు!
సుందరంబగు మధుర స్వనముల!

అందమగు నా భావ గీతము!
అలరి వెలువడ దెందుకో!

ఎందుకో నా వీణ మ్రోవదు
సుందరంబగు మధుర స్వనముల
ఎందుకో! ఎందుకో!

కారు మబ్బులు గ్రమ్మి నటులను
గటిక చీకటి నిలిచి నటులను!
వేయి బాధలు మనసు నందున
వెడలి నటులను గ్రుంకి పోతిని!

చంద మామా లేని రాతిరి
యందములు నశియించు రీతిని!
మంచు గప్పిన కలువ పూవుగ
మనసు మౌనములోన మునిగెను!

ఎన్ని మాటలు విలిచినను నా
విన్నపములను నాల కింపదు!
చిన్ని కృష్ణుని మధుర ప్రేమకు
నెన్ని లేఖల నంప వలెనో!

కంది పోతిని పిచిచి పిలిచీ
చింది పోతిని గీతి బాడుచు!
అందుకే యీ శోక వేదన!
ఇందుకే యీ మనసు బరువూ!

# ఎందుకో నా మనసు

ఎందుకో నా మనసు అందాల శ్రీకృష్ణ!
నీ మురళి వలచి నీ వలలోన దగిలింది!

తన్ను తానే మఱచి తన్మయముతో మునిగి
నీ వెంట నీడగా నిరతమును బయనించు

ఎందుకో నా మనసు అందాల శ్రీకృష్ణ!
నీ మురళి వలచి నీ వలలోన దగిలింది.

నిలిచి పాడవు గదా! నీడ అంచున తరుల
కలసి నే జూడగా గాంక్షగద గోపాల!
కొండ కోనలయందు గొసరి వినిపించెదవు
నే నెటుల నిను జేరి నీటుగా బాడుదును!

అడవులందున ద్రిప్పి యలసతను గూర్చెదవు!
మూరు మూలలయందు మైదానముల యందు!
నీ మురళి వినిపించి నిరతమును నా మదిని
కల్లోల గౌతమిగ కలత పఱచెదు స్వామి!

నీ మురళి వినక నే నిముసముండగ జాల
నిను జూడకుండ నే నిలువజాలను క్షణము!
మాయ జేసితివేదొ! మంత్రమున మురళితో
నే దిరుగుచుంటినీ నీవెనుక బయనించి

నా మనసు కోరికను నయముగా వినుమోయి!
నీ అందచందాల నీ ముద్దు మోమును!
జూడగోరుట లేదు! సుందరంబగు మురళి
నాదాల నాదమై నతిగిబోవగ కోర్కె!

# పక్షి వోలె గగనమందు

పక్షి వోలె గగనమందు
బరువు లెత్తనిమ్ము కృష్ణ!
మేఘమాల నీడలలో
మెలగనిమ్ము హంసవోలె!

పక్షిలాగు గగనమందు
బరువు లెత్తనిమ్ము కృష్ణ!

నింగి నీలి తెరలపైని
నిలిచిన సందెల వెలుగుల!
రంగులలో గలియనిమ్ము
సింగారము జివురులెత్త

కొండలలో కోనలలో
కోకిలవలె నన్ను గూడ!
పాడనిమ్ము ప్రతిధ్వనింప
పరవశమై నీదు గీతి!

సెలయేటిని గొంతు కలిపి
ఝలఝల మను మధుర ధ్వనుల!
నీ పాటల బాడనిమ్ము!
నీ యాటల యాడనిమ్ము!

కనిపింపగ గోరుచుంటి
కమ్మని నీ మధురమూర్తి!
వినిపింపగ వేడుచుంటి
వేణురవము నొక్కసారి!

# మురళి నూదు స్వామి గలియ

మురళినూదు స్వామి గలియ
మోదమునను బోవుచుంటి

మాట మంతిజెప్పి నన్ను
మఱపింపకు డమ్మలార!

మురళి నూదు స్వామి గలియ
మోదమునను బోవుచుంటి!

యుగయుగాల గీతముతో
జగజగాల రాగముతో!
మలయపవను దెరల గూడి
మాధవు దరి జేరుచుంటి!

శుక పికముల జతనుగూడి
చోద్యమౌ మయూరి గూడి
మేఘమాల క్రీనీడల
మెఱపులాగు బోవుచుంటి!

తుమ్మెదలా తూలి పాడి
తోరముగా వెదలుచుంటి
హంసలాగు నాకాశపు
టంచులలో నేగుచుంటి!

గిరులు! తరుల తోరణములు!
నదుల యలలు! గిరిసోనలు!
హరి గలియగ బోవు నన్ను
నడ్డుపడకు డమ్మలార!

# వినిపింపరా మురళి

వినిపింపరా మురళి వీనులకు విందుగా!
కనిపింపరా కృష్ణ! కనుల పండువుగా!

నిఖిల జగమంతటా నిండియుండే నీకు
నా మనసు నలయింప న్యాయమా స్వామీ!

వినిపింపరా మురళి వీనులకు విందుగా
కనిపింపరా కృష్ణ! కనుల పండువుగా!

మకరంద పుష్పాదుల మధురిమల నౌలకించి
పూవు పూవునజేరి పులకరించేవూ!
నవవసంతము నందు నవ్యగీతిక బాడు
గండుకోయిల గొంతు గలసి యుండేవూ!

నింగి నీలాకాశ నీలిమేఘాలలో
హంస బారులలోని యందాలు నీవే!
జాబిల్లి లో చింది జాలుగా బారేటి
వెన్నెలా తరగలా వేడుకలు నీవే!

ఆటలో పాటలో యందటిలో నుండి
అందచందాలతో నమృతము నొలికేవు!
నా గీతి మధురిమల నవ్యతలు వినవేమి?
నా హృదయమందున్న నా కోర్కె కనవూ!

వినిపింపరా మురళి వీనులకు విందుగా!
కనిపింపరా కృష్ణ! కనుల పండువుగా!

# కన్నీటి భాష్పమా!

కన్నీటి భాష్పమా! కలత జెందకుమమ్మ!
చీకటుల తెర తొలగి చిందువెన్నెలలూ!

మురళి నూదే స్వామి ముద్దుగా నినుజేరి
కనికరము జూపులే! కరుణ ప్రోచునులే!

కన్నీటి భాష్పమా! కలతజెందకు మమ్మ!
చీకటుల తెరతొలగి చిందు వెన్నెలలూ!

ఆటుపోటుల జలధి యాలపించేరీతి
మేఘమఖచిన యటుల మెఱుపుతీగెకు మల్లె!
కడు దీర్ఘ ప్రశతులతో కలవరింపకు మమ్మ!
తీయనీ నీ స్వామి దీవెనందెదవులే!

కాఱుమబ్బుల యందు గటిక చీకటులందు
కాఱడవులను దిరిగి కష్టాలు బడకమ్మ!
వెన్నెలలు గురిపించు! వేడుకల మురిపించు
హృదయ ద్వారము తెఱచి సదయతను జేర్చులే!

కన్నీటి ధారలను కదలిజేర్పకు మమ్మ!
కలతలను నలతలను వలపుజిలుగకు మమ్మ!
తీయనీ మురళితో దీర్చునే నీ కోర్కె
ఆనంద సుధలలో నలరించునే స్వామి!

కన్నీటి భాష్పమా! కలతజెందకు మమ్మ!
చీకటుల తెరతొలగి చిందు వెన్నెలలూ!

# మనసెంతో తీపియని

మనసెంతో తీపియని మాధవా! దలచితిని!
కఠిన శిలయంచు నే గానలేనైతీ!

మోహనంబయిన నీ మురళిలో నను గలిపి
మోదమును గూర్తువని మోసపోతిని స్వామి!

మనసెంతో తీపియని మాధవా! దలచితిని
కఠిన శిలయంచు నే గానలేనైతీ!

తీయనీ రాగాల తీపిపాటను వినుచు
కమ్మని స్వరములను గళిగిపోతినిగాని!
సుందరంటయిన నీ చిఱునవ్వు లొలికించి
అందాల పాదాల నందుకోనివ్వవూ!

అందాల నీరవము లలరించి నా మదిని
దివ్య భావాలచే దీప్తిజేసెదుగాని
నా రాగమాధురిని నా గీతిభావమును
ఆలకింపవు గదా! అది యేమి చిత్రమో!

పతివనుచు నిను బిలిచి పలవరించితి గదా!
మది కలతమాపి నను మన్నింపవెందుకో!
కఠినత్వమును మాని కనికరింపుము స్వామి!
శ్రీ మురళినీ నాదు శిరమునను బెట్టుమా!

మనసెంతో తీపియని మాధవా! దలచితిని!
కఠిన శిలయంచు నే గానలేనైతీ

# మధురమగు నీ రూపు

మధురమగు నీ రూపు మాధవా! వ్రాసితిని
రంగు రంగుల గూర్చి రమణీయముగనూ!

భువిలోని యందాలు ప్రోవుగా జతచేసి
పటములో నిలిపితిని పారవశ్యముగనూ!

మధురమగు నీ రూపు మాధవా! వ్రాసితిని
రంగు రంగుల గూర్చి రమణీయముగనూ!

ఎన్ని యందాలు నే నేర్చి కూర్చినగాని
యా యంద చందాలు నలరలేదో స్వామి!
ఆ చిన్ని నవ్వులను ఆ చిద్విలాసమును
ఎటుల గుదిగ్రుచ్చుదును ఏడురంగులయందు?

నీ మురళి వ్రాసితిని నీటుగా నధరమున
ఆ దివ్య సుధనెటుల నందింతు చిత్రమున?
వైజయంతీ శోభ వన్నెలెటు జతగూర్తు?
కరుణ హస్తమునందు కారుణ్య మెటుదెత్తు?

మనసు కోరిక దీర్ప మాధవా! వ్రాసితిని!
నీ దివ్య రూపమును నే నెటుల జతగూర్తు?
సృజన స్థితిలయములను చిత్రముగ నడిపేటి
యంత రంగమునున్న యఖిలేశ! కరుణింపు!

మధురమగు నీ రూపు మాధవా! వ్రాసితిని!
రంగు రంగుల గూర్చి రమణీయముగనూ!

# గొంతులో రాగమా!

గొంతులో రాగమా! కొసరి కొసరీ తెలుపు!
మనసులో నున్న యా మర్మ వేదననూ!

విరహ వేదనంత విప్పారు పద్మముగ
స్వామి కర్పింపవే సరస మాధుర్యముల!

గొంతులో రాగమా! కొసరి కొసరీ తెలుపు
మనసులో నున్న యా మర్మ వేదననూ!

ఎదురు తెన్నులు జూచి యేండ్లు పూండ్లును గడిచె
పవలు రాత్రులు నిన్ను పలవరించు నటంచు!
తీయనీ రాగాల తీపి పాటను బాడి
మమత ప్రేమలు పొంగి మది జాలి చెందునటు!

చిలుకతో బలుకదను! చేరి కోకిలతోని
పాట పాడదు! వినదు! మాటిమాటికి నీదు!
మాట మంతియకాని మధుర వాసంతమున
మాలతీ లతలతో మధురిమలు జిందదను!

వేణు గోపాలయని వేడుకను బలుకుచును
తలుపు తెఱచియుంచు తగనీదు రాకకై!
రెప్పపాటును మఱచె రివ్వుమని బాష్పములు
తరణి దొలుకుచు ఝరిగ తగ సరిత గలిసె నను!

గొంతులో రాగమా! కొసరి కొసరీ తెలుపు!
మనసులో నున్న యా మర్మ వేదననూ!

# కొండ కోనలయందు

కొండ కోనలయందు కోకిలా పాటలా
నీ పాట వినిపించు నిఖిలమంతా కృష్ణ!

నీ మురళి నాదమే నిత్యమై భాసించు!
నీ నర్త నలె జూతు నిఖిల జగమంతటా!

కొండ కోనలయందు కోకిలా పాటలా
నీ పాట వినిపించు నిఖిలమంతా కృష్ణ!

తెలితార లందముగ తేలి నడయాడగా
పాల వెన్నెల యందు ప్రవహించు జాబిలిని!
మురళి మ్రోగించుచును ముద్దుగా బాడు నిను
నా జన్మ సఖుడవని నాథ! నే భావింతు!

మంచు ముత్యాలతో మధురముగ కొలనులో
వేయి రేకులతోని విరిసినా పద్మమున!
నల్లనీ తుమ్మెదా నాట్యమాడి ధ్వనించు
పాట నీ పాటయని భావింతు హృదయమున!

తొలి సంధ్య కెంపులను దొలికేటి చల్లనీ
గాలి కెరటాలలో కదిలేటి రెమ్మలను!
పూచినా పువ్వులా పొరలేటి సవ్వడుల
నాథ! నీ స్వనములని నర్మముగ భావింతు!

కొండ కోనలయందు కోకిలా పాటలా
నీ పాట వినిపించు నిఖిలమంతా కృష్ణ!

# తామరాకు పైని కృష్ణ

తామరాకు పైని కృష్ణ!
తగ వేదన దెలుపుచుంటి!

కొనగోటిని వ్రాయుచుంటి
కోరిక మది గీతముతో!

తామరాకు పైని కృష్ణ!
తగ వేదన దెలుపుచుంటి!

నీకై నే తపియించుచు
నీరసించి నీరసించి!
మధుమాసము నందు గూడ
మారిపోతి నెలవంకగ!

గంధపు జిదుపులను జేర్చి
కఠిన! యిదిగో! చితి బేర్చితి!
భస్మమైన నా ధూళిని
భవ్య! చేత స్పృశియింపుము!

వేదనతో విరహాగ్నిని
వేయి కణములైన ధూళి
కన్నులార గాంచికూడ
కరుణింతువా! లేదో! మఱి!

దీపమారి పోవువేళ
దీన దశను నందువేళ
పాటయాగి పోవువేళ
ప్రార్థన యిదె మన్నింపుము!

# పాట నాపకోయ్ కృష్ణ

పాటనాపకోయ్ కృష్ణ !
పదము నాపకోయ్!

పాము వోలె పడగనెత్తి
పరవశముగ వినుచునుంటి!

పాట నాపకోయ్ కృష్ణ!
పదము నాపకోయ్!
ముద్దు లొలుకు మురిపె మొలుకు
మోము జూపకున్న సరియె!
తేనెవాన కురియు నీదు
తీపిపాట నాపకోయి!

నవ్యరాగ మధురిమలను
నాట్యమాడకున్న సరియె!
పరవశమును గలుగజేయు
పాటమాత్ర మాపకోయి!

పూలచాటు పొదలచాటు
పొంచియుండు మటులె కృష్ణ!
అటులె నిలిచి యా మురళిని
యా మాధురి నాపకోయి!

తీయని నీ మురళీరవ
తీపిపాట నా జీవము!
పాట విననినాడు నాదు
బ్రతుకులేదు పుడమిపైని!

# కనులు మూసిననుగానీ

కనులు మూసిననుగానీ!
కనులు తెఱచిననుగానీ!

నిను జూడగ కోరికతో
నిరతము వెదుకుదును కృష్ణ!

కనులు మూసిననుగానీ
కనులు తెఱచిననుగానీ!

తారలలో వెదుకుచుందు
తన్మయమై రాత్రులందు!
చంద్ర కిరణములను గాంతు
అందములను నుందువసుచు!

కొలనులోని కలువకువలె
కొలది కొలది వికసించుచు!
ఎదురుచూచు చుందునెపుడు
సదయ వేయి కన్నులతో!

మరులుగొంటి నీపైని
మాధవ! నే నిలువజాల!
ఎదలోపల చోటునిచ్చి
సదయ! దయను నేలుకొనుము!

కలలయందు గాంతునన్న
కంటి నిదుర రాదోయీ!
కలవరింతు రాత్రిపవలు
కనులుమూసి కనులు దెఱచి!

# నీలిమేఘాలతో

నీలిమేఘాలతో నిండినది యాకసము
చల్లనీ గాలులను చలియించె లతలూ!

మది విరహమును-బాపి మన్నింపు గోపాల!
ఎదురు జూచుచునుంటి సదయ! నీ రాకకై!

నీలిమేఘాలతో నిండినది యాకసము
చల్లనీ గాలులను చలియించె లతలూ!

తళతళా మెఱుపులను దగకాంతి పుంజముల
ఉఱుములా గర్జనల హోరుమన యాకసము!
నా మదిని విరహాగ్ని నవనీత! యధికమై
పొగలుగా సెగలుగా పొంగుచున్నది పైకి!

సృష్టిలో లేనట్టి సుందరంబులు యేవొ
నీ మురళి నాదమున నిండియుండినవోయి!
విరహాగ్ని తపియించు వేదనల దొలగించి
కరుణజూపి నాదు కలకలము నాపుమా!

వర్షధారలలోని వన్నెలను బ్రకటింపు
హరివిల్లులో నున్న యందాల జూపింపు!
నీ మురళి నాదాల నీ రాగధ్వనులతో
వానకోయిలనౌదు పన్నెలనుజిందగా!

నీలిమేఘాలతో నిండినది యాకసము
చల్లనీ గాలులను చలియించె లతలూ

# మనసులో కోరికను

మనసులో కోరికను మాధుర్య మొలుకుచూ
తీయనీ రాగాన తెలిపెదను కృష్ణా!

కొండల్లొ కోనల్లొ కోకిలా పాటలా
కిన్నెరను మీటుచూ కిలకిలా ధ్వనులతో

మనసులో కోరికను మాధుర్య మొలుకుచూ!
తీయనీ రాగాన తెలిపెదను కృష్ణా!

నెలవంకగా నీవు నీటుగా పడమరను
అందాలు జిందగా నలరనీ చేరువమ!
చిన్ని తారకవోలె చెన్నార మిలమిలలు
మలిసంధ్య కెంపుపై నిలువగా నాకాంక్ష!

మందారమై నీవు మధురిమలు జిందగా
మల్లెపూవుగ నేను మాధుర్య మొలుకుచూ!
సన్ననీ గాలిలో తగ నీదుపై వ్రాలి
తొడిమవిడి జారగా తోరంపు నాకోర్కె!

ఉదయాద్రి శిఖరమున నుదయించు భాస్కరుని
ప్రథమకిరణములాగు పరగ జగతిని వ్రాలి
బంగారు వన్నెలను ప్రకృతిని వెలిగించి
రూపుమాసిపోవ రూఢిగా నాకోర్కె!

మనసులో కోరికను మాధుర్య మొలుకుచూ
తీయనీ రాగాన తెలిపెదను కృష్ణా!

## పిలిచి పిలిచీ స్వామి

పిలిచి పిలిచీ స్వామి! అలసిపోతిగదోయి!
పాట పెగులుట లేదు పరగ కంఠమునా!

మాల గ్రుచ్చగలేను
మదిలోని భావాలు!
కిన్నెరను మీటుచూ
కీర్తింప లేనోయి!

పిలిచి పిలిచీ స్వామి! అలసిపోతి గదోయి!
పాట పెగులుటలేదు! పరగ కంఠమునా!

వీణ పలికిన రీతి వివరింపలేనోయి!
సరిగమల రీతిలో విరియింపలేనోయి!
మనసులో నున్న యా మధుర రాగధ్వనులు!
నీకు నాకే తెలియు నిజముగా గోపాల!

సూత్రమది లేనట్టి సుడులు దిరుగుచు నెగురు
గాలి పడగకు వోలె గతి నుంటి నోయీ!
మంచు బిందువులలో మణిగినా కలువలా
అందాలు చూసినా యబల నే నోయీ!

మనసార బిలుచుచును మాటాడలేనోయి!
తీయగా బలుకుచూ తేనె లొలకగలేను!
మనసు నందే నిన్ను మధుర భావాలతో!
ఆడి పాడీ పూజ లలరించెదను కృష్ణ!

పిలిచి పిలిచీ స్వామి! అలసిపోతిగదోయి!
పాట పెగులుటలేదు! పరగ కంఠమునా!

# కలకాదు నిజమనీ

కలకాదు నిజమనీ కవిత చెబుతోందీ!
కమ్మనీ రాగాన కలకలా ధ్వనులా!

మనసులో నున్న నా మాధవుడు పైకొచ్చి!
మురళీ రవముతోని మోదమును గూర్చెనని!

కల కాదు నిజమనీ కవిత చెబుతోందీ
కమ్మనీ రాగాన కలకలా ధ్వనులా!

నా మనసులో నున్న నా స్వామి నిజముగా
ఆ మురళి వాయించు ఆ చిన్ని కృష్ణుడూ!
తన వేణు నాదమున తన్మయము గావించి
నను మోదమున ముంచి నాట్యాలు జేసెనని!

దోసిలిని యున్నట్టి తొలిపూత పూవులను
కరుణ హస్తము చాచి గారవము జేసెనట!
పాట పాడుచు నేను పరవశములో నుండ
తన ముద్దు మురళినీ తగ శిరము నుంచెనట!

కలగాంచి తనుచు నే కలవరములోనుండి
హంస చేడియలతో నలరి బలుకుచు నుండ!
కలకాదు నిజమనుచు కమ్మనీ నా కవిత
నా స్వామి గారవము నయముగా బలికినది!

కలకాదు నిజమనీ కవిత చెబుతోందీ!
కమ్మనీ రాగాన కలకల ధ్వనులా!

# వేల యందాలతో

వేల యందాలతో వెలిగేటి నీ మోము
రెండు కన్నుల నెటుల నిండార గాంతూ?

మహనీయమైన ఓ మాధవా! నీ కీర్తి
చిన్ని మాటల నెటుల జేర్చి భజియింతూ?

వేల యందాలతో వెలిగేటి నీ మోము
రెండు కన్నుల నెటుల నిండార గాంతూ?

నీలి యాకాశాన నిలిచినా తారలను
నెటుల లెక్కింపగల నీశ్వరా! మదినీ!
చంద్ర బింబములోని జాలులో కిరణములు
ఇన్ని యన్నీ యనుచు నెటుల బలుకుదునూ?

అన్ని దిక్కుల నుండి యాత్రిబాపే స్వామి!
చిన్ని కోవెల నెటుల జేరి భజియింతూ?
అన్ని నామములతో నలరేటి నా స్వామి!
మాధవా! యని నిన్ను మదినెటుల గొలుతూ!

సరస వచనములతో సాధు గీతములతో!
చిన్ని నా హృదయమున జేర్చి బాడుచునుంటి!
అఖిల జీవులయందు నలరియుందువు గదా!
నా మనసు వేదనను నయముగా వినలేవ?

వేల యందాలతో వెలిగేటి నా స్వామి!
రెండు కన్నుల నెటుల నిండార గాంతూ?

# చివురులార! పూవులార!

చివురులార! పూవులార!
చిత్రమైన తీవెలార!

మాతవు తీట దాగినాడ
మమత విరియ దెలుపుడమ్మ!

చివురులార! పూవులార!
చిత్రమైన తీవెలారా!

మధుర మురళి మ్రోగించుచు
మానసముల దొంగిలించు!
తీయని మురళిని నూదీ
తేనెలు గురిపించు నమ్మ!

నెమలి పింఛమును ధరించి
నీటుగులుకు నాలమంద!
గోపకాంతలందు జేరి
కొంటె సరసమూడు వాడు!

విశ్వమంత నిండియుండి
విమల హర్ష మోదములను!
తమ బాడెడి వారి కొసగి
ధన్యాత్ముల జేయువాడు!

నే నైతిని చరణదాసి
నిలువలేను నతని బాసి!
తరుల లతల నెట దాగెనొ
ధన్యాత్ములు దెలుపుడమ్మ!

# ఏ ముందో నీ మురళిని

ఏముందో నీ మురళిని
ఎన్నరాని యా సొగసులు !

మనసు మూర్ఛనలు బోవును!
మల్లెలు మొల్లలు పూయును!

ఏముందో నీ మురళిని
ఎన్నరాని యా సొగసులు!

మధుర మురళి వినిపించును
మాధుర్యము పొంగి పొరలు!
తీయని యొక భావ గీతి!
తెరలు నాదు మనసు పొరల!

ఏనాటిదో యొక భావము!
ఏనాటిదో యొక చిత్రము!
హృదయ మందు దాగియుండి
కదలుచుండు చిత్రముగా!

మఱచిన యా భావమేదో!
చెరిగిన యా చిత్రమేదో!
అందింపుము హృదయేశ్వర!
ఆత్మీయుడ వగుదవు గద!

కంటి నుండి బాష్పధార
కదలి పొంగు జలధారగ!
ఎంత యాపినను నాగదు
ఏ విచిత్ర సంబంధమొ!

# చందమామ కాంతులలో

చందమామ కాంతులలో
చక్కనైన యీ రాత్రిని

ఆదరి నా నావ జేర్చి
యాదరింపవా కృష్ణా!

చందమామ కాంతులలో
చక్కనైన యీ రాత్రిని!

వాగు వరద రాక మునుపు
ఒడ్డు కూలి పోక ముందు!
పయనమైన నన్ను నాదు
పడవ తీరమునకు జేర్పు!

వినువీధిని మబ్బు గ్రమ్మి
పెనుగాలులు రాక ముందు!
తూలిపోక వాలిపోక
తోరముగా దరిని జేర్పు!

సుడుల సుడుల జిక్కకుండ
సోలిపోక కఠిన శిలల!
దారి తప్పకుండ నడిపి
దరి జేర్పుము తీరమునకు!

పాటపాడి పడవ నడిపి
పదిలముగా దరిని జేర్పు!
ఆత్మార్పణమని యంటిని
యాదుకొనుము! కరుణతోడ!

# నీ మురళి సొంపులను

నీ మురళి సొంపులను నే గలిసి పోతినీ!
నే నెవరినో కృష్ణ! నేదెలుపలేనోయి!

కనికట్టుతో నన్ను గారడీ జేసితివా
మనసు బొమ్మగ జేసి మాయ గావించితివా!

నీ మురళి సొంపులను నే గలిసి పోతినీ!
నే నెవరినో యేమొ నే దెలుప లేనోయి!

అందాల జాబిలిగ యతికి పోతిని నింగి!
వెన్నెలా వాకలను వెలుగులను జార్చుచూ!
మింటి తారకలందు మిలమిలా మెఱయుచును
మబ్బు కన్నెల తోడి మాటాడు చుంటినీ!

ఆషాఢ మేఘాల యలరె హరివిల్లుగా
ఏడు రంగుల సొగసు వేడుకను బొందితిని!
దివినంత యల్లుకొని భువికి నే నగబడుచు
నొయ్యారి సొంపులను నొలకబోయుచునుంటి!

నవవసంతపు రీతి నాథ! నను జేసితివి!
పూదేనె పుప్పొడుల బులకరించుచు నుంటి!
కొమ్మపై పాడేటి కోకిలగ జేసితివి!
హంసభామను జేసి యలరుచుంటివి స్వామి!

నీ మురళి సొంపులను నే గలిసి పోతినీ!
నేనెవరినో కృష్ణ! నే దెలుపలేనోయి!

# వెడలకోయి! మఱలకోయి!

వెడలకోయి ! మఱలకోయి!
వేణురవళి యాపకోయి!

చెలియ మాట మన్నింపుము
చేరువగా రమ్ము కృష్ణ!

వెడలకోయి మఱలకోయి!
వేణురవళి యాపకోయి!

కన్నులార గాంచనిమ్ము
చెన్నుగ నీ నగుమోమును!
తీయని నీ మురళీరవ
తేనెల నను గ్రోల నిమ్ము!

చిఱుగజ్జెల రవళి తోడ
చెదిరిన పూ మాలతోడ!
నరనలను నాదు మదిని
నవనీతము నింప రమ్ము!

గోప బాలు రందఱితో
కూడి నాట్య మాడేవూ!
నాదు కోర్కి దీర్చి మదిని
నవనీతము సేయరాద!

పూర్ణ పురుష! యనుచు నిన్ను
పూజసేయనిమ్ము కృష్ణ!
వెలుగు నందు వెలుగు నిలిపి
వేల సుఖము లంద నిమ్ము!

# మనసెందుకే నీకు

మనసెందుకే నీకు మర్మమగు బాధా?
అంతరంగమునందు నాత్మ విభుడుండగా

మురళీరవ ధ్వనులు మోదమున వినవేమి?
వెనుదిరిగి జూడుమా! వెన్నంటు స్వామినీ!

మనసెందుకే నీకు మర్మమగు బాధా?
అంతరంగమునందు నాత్మ విభుడుండగా!

దిశలన్ని యడలుచును దీనముగ బలికేవు!
దిక్కులన్నీ వెదికి దిశల బరికించేవు!
చెంతనున్నా దీపకాంతులను గనవేమి?
మురళి యూదేటి యా మురిపెమును గనవేమి?

కనిపింపుమని విభుని కలకలా ధ్వనులతో
కన్నీరు కడవలుగ కాల్వగా దొలికేవు!
మదినున్న మాధవుని మధుర మురళిని వినవు!
మధురముగ దరిజేరి మన్నింపుమని యనవు!

కనుల గనిపింపుమని చెవుల వినిపింపుమని
కరుణతో నవ్వుమని కలహించెదవుగాని!
వెనుదిరిగి జూడవుగ వేడుకను బలుకవూ!
అణువణువు నిండినా యఖిలేశు! పరమేశు!

మనసెందుకే నీకు మర్మమగు బాధా?
అంతరంగమునందు నాత్మ విభుడుండగా!

# పాట పాడనిమ్ము కృష్ణ

పాట పాడనిమ్ము కృష్ణ!
పరవశముగ గొంతునెత్తి

నీ మురళీ స్వనములతో
నీటుగ నా గొంతుకలిపి

పాట పాడనిమ్ము కృష్ణ!
పరవశముగ గొంతునెత్తి!

హిమగిరి శిఖరముల నుండి
విమల జలల ధారలటుల!
నర్తనలను నా పదములు
నవభంగిమ అలరింపగ!

వెన్నెల తీగెలు సరిగమ
వన్నెలు వే జిందుచుండ
చిన్ని తారకలు కిన్నెర
చెన్ను మీర మీటుచుండ!

సప్త స్వరములను గూడుక
సరసగీతి నే బాడగ!
శుకపికములు మోరనెత్తి
చోద్యముగా వరుస గలుప!

కొలకులందు నీటి పక్షు
అలల రేపి నాట్యమాడ!
హంసబారు లాకసమున
అలరి యండె రవళి సేయ!

# వినిపింపరా మురళి

వినిపింపరా మురళి వీనులకు విందుగా!
కనిపింపరా కృష్ణ! కనుల పండువుగా!

అలనాటి వ్రేపల్లె యాలమందల నడుమ
చిన్ని కృష్ణుడవైన చెన్ను జూపింపరా!

వినిపింపరా కృష్ణ! వీనులకు విందుగా!
కనిపింపరా కృష్ణ! కనుల పండువుగా!

అల యశోదకు నాడు అందాల కూనవై
చిలిపి చేష్టలు జేయు చిన్నారివై యలరి!
అందాలు జిందేటి యానాటి నగుమోము
ఒకసారి చూపరా! యోపజాలని సుఖము!

గోవర్ధనము నెత్తి గోపకుల గాపాడు
గోపకాంతల గూడి గోవింద! యానాటి!
రాసక్రీడల నాడు రమ్యమగు రూపమును
మోహింతు నొకసారి మోదమున జూపరా!

మన్ను దిన్నానోట మాధవా! తల్లికి
పదునాల్గు భువనాలు బరగజూపిన నాటి!
చిన్ని మోమును నాకు దీరుగా జూపించి!
నన్ను పన్ననజేసి నా కోర్కె దీర్పరా!

వినిపింపరా మురళి వీనులకు విందుగా!
కనిపింపరా కృష్ణ! కనుల పండువుగా!

# ఏ పాట నిలువదూ

ఏ పాట నిలువదూ! నీ పాటయేగాని!
నా మనసు పొరలలో నాట్యములు సలుపూ!

నీ మురళి స్వనములే
నినదించు దిక్కులను!
నీ వేణు రవములే
నిఖిలమంతా మ్రోగు!

ఏ పాట నిలువదూ! నీ పాటయేగాని!
నా మనసు పొరలలో నాట్యములు సలుపూ!

కొండ కోనలయందు కోకిలలు పాడినా
గల గలా ప్రవహించు అలల ధ్వనులను విన్న!
మబ్బుకన్నెలు కలిసి మాటాడుటను విన్న
నీ మురళి స్వనములే నిండార వినిపించు!

పచ్చనీ చిలుకలూ, పసిడి గోరింకలూ,
పాడినా పాటలూ! పలికేటి పలుకులూ!
విచ్చినా పూలపై విరిసినా తుమ్మెదలు!
మాధవా! నీ మురళి మధుర ధ్వనులనిపించు!

చిఱుగాలి చెలరేగు చిత్రమగు సవ్వడుల
మంచు బిందువుల యా మర్మర ధ్వనులందు
విశ్వమంతా మ్రోగు విమల ఓంకారమున
నీ మురళి యందాల నిస్వనము లనిపించు!

ఏ పాట నిలువదూ! నీ పాటయేగాని!
నా మనసు పొరలలో నాట్యాలు సలుపూ!

# నిండుపూల దోసి లిదిగో!

నిండుపూల దోసి లిదిగో!
నీరజాక్ష! వందనమిదె!

సన్నని నా భావగీతి!
సరసముగా గారవింపు!

నిండుపూల దోసిలిదిగో!
నీరజాక్ష! వందనమిదె!

మంజులమగు పదములతో
మాలగ్రుచ్చితోయి కృష్ణ!
మాల మెడ ధరించి నాదు
మమత దీర్ప రాగదోయి!

తీయని నా రాగసుధను
వెలిపిన నా హృదయ గీతి!
ఓరచూపు జూచి కరుణ
నొసగరాద! నాదు కోర్కె!

కలకలమగు కరుణరసము
గలభావము గారవింపు!
చరణదాసి వినతిని విని
చేపట్టుకొనుము! హృదయపీఠి!

వెన్నెల పూవులను దెచ్చి
వేడ్క మీర తారకలను!
కంటినీరు జాలువార
కానుకగా నిచ్చుచుంటి!

# వెన్నెలంటే నాకు

వెన్నెలంటే నాకు ఎందుకో మురిపాలు!
మణిగుండ జాలదూ! మనసులో పాటా!

మెల్లగా పైకొచ్చి సన్నని రాగాన
ఒల్లనీ విధునిపై ఒలకబోయును ప్రేమ!

వెన్నెలంటే నాకు ఎందుకో మురిపాలు!
మణిగుండజాలదూ! మనసులో పాటా!

వెన్నెలా జాబిల్లి వన్నెలను జూచుచూ
కథలు జ్ఞాపకమొచ్చి కంట నీరొలుకుదును!
పదములన్నీ కలిసి పాటగా రూపొందు!
రాగమై గానమై రంజిలును గీతముగ!

ఆ దరిని యున్న యా యందాల కడిమిపై
మురళి మ్రోయించేటి మోహనాంగుని జూచి!
పటమపై పయనించి ప్రభుసన్నిధిని జేరి
కలిసి పాడిననాటి కథలు మది నుప్పొంగు!

తీయనీ కథ లేల? తీపి ముచ్చట లేల?
మాధవుడు నను మరచె మదిపొంగులు చుంటినీ
చల్లనీ వెన్నెలా సాంద్ర కిరణములార!
మనసు నొప్పింపకుడు! మధుర స్మృతులను దెచ్చి!

వెన్నెలంటే నాకు ఎందుకో మురిపాలు!
మణిగుండ జాలదూ! మనసులో పాటా!

# మధు వసంతమునందు

మధు వసంతమునందు మాధవా! యెడబాటు
భరియింపలే నికను బాంధవా! రమ్మూ!

తామరాకూపైని తగ ప్రేమ లేఖనూ!
కొనగోటితో వ్రాసి కోరికను దెలిపెదను!

మధు వసంతమునందు మాధవా! యెడబాటు
భరియింపలేనికను బాంధవా! రమ్మూ!

అందాల పదములను అల్లి నవగీతిగా
సుకుమార భావాలు సుందరంబుగ గూర్చి!
మనసు కరిగేరీతి మధుర భక్తిని దెలిపి
మన్నింపుమని వేడి మధువు నొలికెదనూ!

ఏ జేమ జన్మలా యేకాంత భక్తినీ
ఫలియునిమ్మనుచు నే ప్రార్థనను జేయుచూ!
ఆత్మార్పణంబనుచు నంజలిని ఘటియించి
నీ దాసినని బలికి నీటుగులికెదనూ!

కన్నీరను మీటుచూ కీర్తనను బాడుచూ
నీ దారి వెదుకుచూ నిలిచియుంటిని స్వామి!
మందారమాలనూ మధురముగ చేదాల్చి
వరియింప దలచినా వధువు నే ననుచుంటి!

మధు వసంతమునందు మాధవా! యెడబాటు
భరియింపలేనికను బాంధవా! రమ్మూ!

# సంధ్యా వెలుగులయందు

సంధ్యా వెలుగులయందు సరసుడగు నా స్వామి!
నిలిచినాడో యేమొ! నీలి గగనమునా!

అందుకే వెలసినవి
యా పసుపు కుంకుమలు!
పసిడి తోరణములూ!
బంగారు కాంతులూ!

సంధ్యా వెలుగులయందు సరసుడగు నా స్వామి
నిలిచినాడో యేమొ! నీలి గగనమునా!

చిమ్మ చీకటులన్ని చిత్రముగమాసినవి
బంగారు పూతగా పల్లవించెను జగతి!
తెల్లనీ చుక్కలూ చల్లగా నా స్వామి
ఒడి జేరినవి యేమొ! వరుసగా నన్నియును!

పూలన్ని విరిసినవి! పుప్పొడులు రాల్చినవి!
మంచుబిందువులొప్పె మాణిక్య రాసులుగ!
పక్షులా కిలకిలల పలుకులను వనవీధి
నిత్యోత్సవంబయ్యె నీటుగా శ్రీహరికి!

చైతన్య రథ మిదిగో! జగతి మేల్కొన్నదీ!
సామగానమురీతి సరిగమలు పాడినవి!
నా స్వామి మురళియే! నా విభుని స్వనములే!
విశ్వమంతా మ్రోగె! విమల గాంధర్వమున!

# మనసులో కోరికను

మనసులో కోరికను మాటుజేయగ లేను!
తెలియ జేయుచునుంటి తెల్లముగ స్వామీ!

అందాల గీతికను నలరు పూదండగా
నందించు చుంటినీ! యాత్మార్పణం బనుచు!

మనసులో కోరికను మాటు జేయగలేను!
తెలియ జేయుచునుంటి తెల్లముగ స్వామీ!

తొలికారు మేఘముగ తొలుకాడి నింగిలో
కదలాడి మెదలాడి కమనీయ కాంతులను!
మెఱుపు కన్నెలతోని మేలుగా నటియించి
వర్షధారల వసుధ వర్షింప నా కోర్కి

సంజ వెలుగులయందు సరసనతను వికసించి
కదలాడి మెదలాడి కమనీయ కాంతులను!
కమ్మనీ వాసనల కమనీయ మధురిమల
పూవుగా వనవీధి పులకరింపగ కాంక్ష!

ఆనంద సుధలనూ అలరించు నీ మురళి
తీయనీ స్వనములను దీరుగా నే గూడి!
సరిత వే జలధిలో సంగమించిన రీతి!
కలిసి పోవాలనీ కాంక్షరా గోపాల!

మనసులో కోరికను మాటు జేయగలేను!
తెలియ జేయుచునుంటి తెల్లముగ స్వామీ!

# వెన్నెలల సొగసులా

వెన్నెలల సొగసులా! వేడుకను నొలుకుచూ!
అందాల జాబిల్లి యలరి వచ్చేవేళ!

మబ్బుల్లో సిగ్గుల్లో మధురముగ మిణుక తార
పాటపాడే రీతి పాడనా కృష్ణా!

వెన్నెలల సొగసులా! వేడుకను నొలుకుచూ!
అందాల జాబిల్లి యలరి వచ్చేవేళ!

చివురులూ పువ్వులూ చిత్రమగు కాంతులను
నవ్య వాసంత మిల నాట్యమాడేవేళ!
కోకిలా గొంతెత్తి కొసరి మాధుర్యమున
పాడేటి రీతిగా పాడనా కృష్ణా!

నీలి మేఘాలతో నిండినా యాకసము
ఉఱుములను నుఱుముతూ మెఱుపు మెరిసేవేళ!
వన మయూరమువోలె నర్తిల్లి నాట్యమున
వయ్యారమున సొగసు నొలకనా కృష్ణా!

మన బంధమిది గదా! మన స్నేహమిది గదా!
జన్మ జన్మలనాటి జాలుగద స్వామీ!
నీ వయస్కాంతమూ నే లోహమును గదా!
నిను జుట్టి తిరుగుదును నిలువ కొక చోటనూ!

వెన్నెలల సొగసులా! వేడుకను నొలుకుచూ
అందాల జాబిల్లి యలరి వచ్చేవేళ!

# ఎంత దూరమున్న

ఎంత దూరమునున్న యెన్ని తెరలున్ననూ!
నీ మురళి వినిపించు నీటుగా కృష్ణా!

అణువణువు పులకించు
అమృతము వర్షించు!
నీ మురళి స్వనములను
నే గలిగి పోదురా!

ఎంత దూరమునున్న యెన్ని తెరలున్ననూ!
నీ మురళి వినిపించు నీటుగా కృష్ణా!
మల్లె మాలతి పొదల మధురముగ వినిపించు
మోహనంబైన నీ మురళీరవ ధ్వనులు!

నే నౌదు నర్తకిగ నెమ్మనం బుప్పొంగు
చిఱుగజ్జె లల్లాడ చిందుదును నాట్యమును!
కొమరొప్ప కెరటాల గోదావరీ నదిని
ఆ దరిని నిలిచి నీ వాలపించిన యటుల!

తీయనీ రాగాలు తేనె ధారలుచింద!
నా మదిని వెన్నెలలు నాట్యాలు సలుపునూ!
పూదీగె గాంచినా పున్నమిని జూచినా
మావిగున్నను గన్న మలయవీచిని గన్న

మోహనంబయిన నీ మురళిపాటను విందు!
రమణీయ నర్తనల రాజనర్తకి నౌదు!

## విశ్వ సౌందర్యమును

విశ్వ సౌందర్యమును వెలయించు నీ మురళి
పాటలో లీనమై పరవశము నొందనీ!

అన్ని మఱచీ నీదు
అందాల మోములో!
కనులు కలిపీ నాదు
కాంక్ష పులకింపనీ!

విశ్వ సౌందర్యమును వెలయించు నీ మురళి
పాటలో లీనమై పరవశము నొందనీ!

సంధ్య వెలుగులవోలె సౌందర్య మెగబోసి
ఆకాశ మంతటను యలరనీ కుంకుమలు!
ఓంకార ధ్వనులందు నొయ్యారముగ జేరి
మటుమాయమై పోదు! మాధుర్యమును జింది!

వర్షమునుములందు వన్నెలను జిందేటి!
హరివిల్లువలె నీదు అందాలు జిందనీ!
నేనొడు నొకరంగు నీయందు లీనమై
జీర్ణమై శీర్ణమై చివికిపోదును నింగి!

హేమంతమున విరియు హిమబిందువుల వోలె
అణువణువు నందునను నలరనీ యందములు!
బిందువుగ రూపొంది యందాలు జిందుచూ!
అరుణ కాంతులయందు హరియించి పోదునూ!

# సప్తస్వరముల నొలుకు

సప్తస్వరముల నొలుకు సంగీతమును వినిన!
సుచిరంబయిన యే సుదరంబులు గనిన!

ఏనాటివో నాటి మధురిమలు మదికొచ్చు
కలత నిండును మనసు కనుల నీరొలుకునూ!

సప్తస్వరముల నొలుకు సంగీతమును వినిన!
సుచిరంబయిన యే సుందరంబులు గనిన!

తొలి సంధ్య మలిసంధ్య తోరణంబులు గనిన
వాసంత వనవీధి వన్నెలను గాంచినా!
చంద్ర కిరణములలో సాంద్రతను గనుగొన్న
తలపులేవో వచ్చి తపియింతు మౌనముగ!

కొండ కోనలలోని కోకిలల గీతములు
చిలుక గోరింకలా చిత్రమగు వాదనలు!
చిన్నారి బాలలా చిటి మాటలను విన్న
మంచు సొగలకు మల్లె మది మసకలై పోవు!

ఏనాటి రాగమో! యేనాటి భావమో!
అతికినది చిత్రముగ యంతరంగమునందు!
నను విడిచి పోవుగద! నాముద్దు శ్రీకృష్ణ!
నీడవలె నావెంట నిలిచి యుండెద వెపుడు!

సప్త స్వరముల నొలుకు సంగీతమును వినిన!
సుచి చిరంబయిన యే సుందరంబులు గనిన!

# చందమామా! నీకు

చందమామా! నీకు అందాల పూదండ!
నీ వెన్నెలంటేను నిండు గారవమూ!

విడి వడిన దంపతుల వేదనల తొలగించి
మఱల ప్రేమల నింపు మధుర మూర్తివి గాద!

చందమామా! నీకు అందాల పూదండ
నీ వెన్నెలంటేను నిండు గారవమూ!

ఒకనాటి యాస్నేహ మొకనాటి బాంధవము!
అన్ని తెలియును నీకు అలనాటి ముచ్చటలు!
వేఱువడినా నేను వ్యథను దొగలుచు నుంటి
మాటాడకున్నావు! మఱచు టిది న్యాయమా?

వెన్నెలా బయలులో పన్నెలా తిన్నెలను!
తీగె పొదరిండ్లలో తీరైన తరువులను!
ఓంకార నాదమున నోలలాడితిమి గద!
మా మధుర గీతాల మఱచుటిది న్యాయమా?

దూర దేశమునున్న సుపతి నే జాబిల్లి!
పతి విరహమున నే నుపాలిపోయితి నోయి!
నా వినతి స్వామికి నర్మముగ తెలుపవా?
సతిపతుల గూర్పగను దగ నీవు పెద్దవూ!

చందమామా! నీకు అందాల పూదండ!
నీ వెన్నెలంటేను నిండు గారవమూ!

# ఆ భావమేదియో!

ఆభావమేదియో! యేరాగ మేదియో!
నిలిచి పలుకదు నాతో నిండు హృదయమునా!

మబ్బుచాటున నున్న మధురమగు నెలవంక!
కాంతి కిరణములాగు కలత మది దొలికించు

ఆభావ మేదియో! యేరాగమేదియో!
నిలిచి పలుకదు నాతో నిండు హృదయమునా!

అంతరంగమునందు నలరు ఛాయకు బోలె
నిలిచి పిలుచును నన్ను నీడవలె యెచటికో!
మోహనంబైన తన మోము జూపింపదూ!
తీయనీ పలుకులను తేనె లొలికించునూ!

కవి మదిని తారాడు కమ్మనీ గీతిలా!
తెరవెనుక నర్తకీ చిఱుగజ్జె మ్రోతలా!
దూరాన మేఘాల తొలికారు మెఱుపులా!
విప్పి చెప్ప దదేమొ! విశదముగ తనమాట!

మాట పలుకూ లేక మర్మముగ పిలుచునూ!
అంతరంగమునందు ఆటుపోటులు రేపు!
మాటకందని దేదొ! మాధుర్య మున్నదను!
ఊహకందని దేదొ! ఓంకారమున్న దను!

ఆభావమేదియో! యేరాగ మేదియో!
నిలిచి పలుకదు నాతో నిండు హృదయమునా!

# గొంతులో తారాడు

గొంతులో తారాడు కోటి తీగెల వీణ!
ఒకపాట పాడవా? ఒయ్యారి నడలా!

హంస నడకల వోలె అప్సరా గజ్జెలా!
మలయ వీచిక వోలె మధురమగు సోనలా!

గొంతులో తారాడు కోటితీగెల వీణ
ఒకసారి పాడవా? ఒయ్యారి నడలా!

వెన్నెల అల వానతో వన్నెలను చిందుచూ!
చివురులను పువ్వులను చిత్రముగ ధరియించి!
ఏటి నురువులతోన పాటల్లను పాడుచూ
వొయ్యారముగ నాడు నొలికించినా రీతి!

కలువ తామరలతో గదలాడు కొలకులను
నీటి పక్షుల నడుమ నిండారు స్నానముల!
మధుర సహకారముల మాధవీ లతలందు
పాడినా పాటొకటి! పాడవా! గొంతెత్తి!

తంత్రులన్నీ తునిగి తరిగి పోయెన సొగసు!
మనసులో భావాలు మంచుతెర గప్పెనా?
ఆనాటి గీతాలు నలరి పాడగలేవ?
ముద్దొచ్చు మాధవుని మురిపింపగా లేవ?

గొంతులో తారాడు కోటి తీగెలవీణ!
ఒకపాట పాడవా! ఒయ్యారి నడలా!

# మునిశాప మేదియో

మునిశాప మేదియో మోహనా! తగిలినది!
మఱచిపోతివి నాదు మధుర స్మృతులన్ని!

నీ చింతచే మునిగి నిఖిలమును మఱవగా!
కఠినుడగు తపసిచే కలగుంటు బడితినీ!

మునిశాప మేదియో మోహనా! తగిలినది!
మఱచి పోతివి నాదు మధుర స్మృతులన్ని!

పూలరేకులు బఱచి పున్నమీ వెన్నెలను
నీ పాద యుగళి నే నిరతమును సేవింప!
మధుర మురళిని యిచ్చి మన్నించితివి గదా!
మధుర గీతము బాడి మది మురిసితిని గదా!

ఎన్ని చెప్పినగాని విన్నపము వినవుగద!
కల్లలని చెల్లవని కసిరితివి దూరముగ!
కన్నీటి ధారలను గలత చెందిన మదిని
చల్లనీ చూపులను సరసతను జిందవూ!

ఆనాటి మురళి నే నానవా లెటు దెత్తు?
మునిశాప మెటు దీరు? మోహమెటు బాయునో?
మావికొమ్మను మఱల మాధవీ లత జేరు?
మది నన్ను గుర్తించి మన్నింతువో కృష్ణ!

మునిశాప మేదియో మోహనా! తగిలినది!
మఱచిపోతివి నాదు మధుర స్మృతులన్ని!

# కొండలను కోనలను

కొండలను కోనలను కోకిలా పాటలా
ననుబాడనీ కృష్ణ! నా ప్రేమగీతి!

మందార పూవులా
మధురిమలు చిందనీ!
వనవీధి యంతటను
వన్నెలను జిందనీ!

కొండలను కోనలను కోకిలా పాటలా
ననుబాడనీ కృష్ణ! నా ప్రేమగీతీ!

పచ్చనీ కాంతులను పసిడి పూరేకులను
చిలుక గోరింకలా చిన్నారి ముచ్చటలు!
నా పాటలో చేరి నాదముగ మారాలి!
నావీణ తీగెలో నర్తనలు చేయాలి!

వాసంత ఋతువులో వనకన్నియలు వచ్చి
చివురులా పువ్వులా చిత్రమగు కాంతులను!
తుమ్మెదల పాటతో తూలుతూ పాడేటి
సొగసుగా నాపాట సుందరం బవ్వాలి!

మంచుకొండను మల్లె మల్లెపూ తెలుపులా
శాంతికాంతులు చింది సౌభాగ్య మొందాలి!
నా మధుర గీతమే నాజీవ నాదమై
నాగుండె శృతిలయల నర్తనలు చేయాలి!

కొండలను కోనలను కోకిలా పాటలా
ననుబాడనీ కృష్ణ! నాప్రేమగీతిని!

# తరులార। లతలారా।

తరులార! లతలార! తపన జెందకుడమ్మ!
పూలు చివురులతోడ పులకరించండి!

నను జూచి పొంగిలేటి
నా నర్మ చెలులు! మీ
సంతాపమును జూచి
సహియింప లేనమ్మ!

తరులార! లతలార! తపన జెందకుడమ్మ!
పూలు చివురులతోడ పులకరించండీ!

నా నాథు విరహమున నలత జెందిన నేను!
కదలి పోతగ గుండె కలవరము జెందగా!
నా వేదనను జూచి నలిగి పోకండమ్మ!
కరుణతో కన్నీరు కురియ బోకండమ్మ!

పాదులను నింపినా పరిమళపు జలములను
యెండలను ముట్టకను అలమటించుట తగున?
చిన్నారి చిగురులవె! చిన్నబోయినవమ్మ!
విరిసినా పువ్వులూ వెలవెలా బోయినవి!

మలయ పవనకలతో మాటాడుటను మాని
పుప్పొడుల నొకటొకటి పుడమి జిందుట తగున?
పూదేనె లన్నిటిని పొగిలి కన్నీరుగా
కురియు చుండుట తగున? కుందుచూ నాకొఱకు!

తరులార! లతలార! తపన జెందకుడమ్మ!
పూలు చివురులతోడ పులకరించండీ!

# కలువ తామరలార!

కలువ తామరలార! కమనీయ చెలులార!
పతిదేవతలు మీరు! భాగ్య మన మీదే!

నోచినా చేసినా
నోములను వ్రతములను!
వివరించి చెప్పరె
వేడుకను నే జేతు!

కలువ తామరలార! కమనీయ చెలులార!
పతిదేవతలు మీరు! భాగ్యమన మీదే!

పగలంత విరహమున పతిని మది తలచుచూ!
ఎదురు చూపులుజూచి యెద శాంతి నొందగా!
చల్లగా మెల్లగా జాబిల్లి దిగివచ్చి
చెల్లనీ కిరణముల దేలించు మీపు ప్రేమ!

వేయిరేకుల సొసువు వేడుకను ధరియించి
రాత్రి రాత్రంతయును రమణుకై తపియింప!
బంగారు కిరణముల బాలభానుడు వచ్చి
వేయి కిరణములతో వేడుకను జేయుగద!

దినము దినమూ గడిచె దీర్ఘమౌ వర్షములు!
జన్మ జన్మలు గడిచె జాలియే లేదుగద!
ఆ నోము ఆ వ్రతము నలరి తెలుపండమ్మ!
ఆచరించెదనమ్మ! అభిలాష నొందగా!

కలువ తామరలార! కమనీయ చెలులార!
పతిదేవతలు మీరు! భాగ్యమన మీదే!

# నా విరహ వేదనను

నా విరహ వేదనను నర్మముగ దెలుపుడో!
మబ్బుకన్నెల్లార! మాధవునిజూచీ!

పసిడికానుక లిత్తు బంగారు హారములు
చీనాంబరములను జెన్నుగా మీ కిత్తు!

నా విరహ వేదనను నర్మముగ దెలుపుడో!
మబ్బు కన్నెల్లార! మాధవునీ జూచీ!

చుక్కలను రిక్కలను సూర్యుడుండే చోటు!
చల్లనీ జాబిల్లి చరియించు చోటులను!
మూడు పాయలు గంగ మోదముగ చీలేటి
యా చోటులను జూచి హరిని దర్శింపుడో!

హంస బాటలనడిగి యలరి దివి పక్షులను
అందాల హరివిల్లు నడుగుడో హరి జాడ!
మెఱుపు చేడియలతో మేలముగ మాటాడి
నా నాథు జాడలను నయముగా దెలియుడో!

కనుమూయ కనుదెఱప కంటి నీరొలుకుచును
పొలిపోయిన దనుడు! పండినా పత్రముగ!
కనులలో ప్రాణాలు గలవంచు దెలుపుడో!
నీ దర్శనము కొఱకు నిలిచె నీ పుడమి నని!

నా విరహ వేదనను నర్మముగ దెలుపుడో!
మబ్బు కన్నెల్లార! మాధవుని జూచీ!

# తొలికారు మబ్బుల్లో

తొలికారు మబ్బులో తొలుకాడు మెఱుపులా
నా యెదను నా స్వామి నాట్యాలు సలుపునూ!

తొలిసంధ్య కాంతిలా
తూగాడి భావమున!
మధుర మురళిని బాడి
మదిని బులకించునూ!

తొలికారు మబ్బులో తొలుకాడు మెఱుపులా
నా యెదను నా స్వామి నాట్యాలు సలుపునూ!
సృష్టిలో చోద్యాలు సుందరంబులు గనిన!
వీణాది వాద్యములు వేయివిధములు వినిన!

ఆ దివ్య రూపమే యందాలు మది మెదులు
ఆ మురళి స్వనముతో యలరి మ్రోగును హృదిని!
నెమలి పింఛముతోడ నీటుగా మురళితో
గోపబాలుర తోడ గూడి నడయాడుచును!

అల గుండెల మధ్య యల్లాడు బాలుడే
నా మదిని నిండినా నా స్వామి! నా విభుడు!
జన్మ జన్మలనాటి స్నేహమిది! బంధమిది!
మఱచి పోజాలనిది! మతి చెఱిగి పోనిదీ!

కాంతిలో కాంతినై
కఱిగి పోయేదాక
కలిసి మెలిసీ యుండు
కాపురము! బాంధవము!

తొలికారు మబ్బులో తొలికాడు మెఱుపులా!
నా యెదను నా స్వామి నాట్యాలు సలుపునూ!

# మధుర మురళి నాదముతో

మధుర మురళి నాదముతో
మాధవ! నే నేకమైతి!

కిన్నెర వలె మ్రోగుచుంటి!
కీర్తనలో కలిసిపోతి!

మధుర మురళి నాదముతో
మాధవ! నే నేకమైతి!

అణువణువున నమృత సోన
అలరుచుంటి తన్మయమై!
నవవసంత శోభలతో
నాట్యాలను సలుపుచుంటి!

దివి యేదో భువి యేదో
దిక్కులనే మరచిపోతి!
తారలలో నొక తారగ
తరలుచుంటి నేనెటకో!

పూల పడవ నే నుంటినా!
పూలపడవ నే నైతినా!
అలల పైని దేలుచుంటి
అమరగాన సుధల యందు!

స్వరమునందు స్వరముజేసి
గీతమందు గీతకాగ!

కాంతి యందు కాంతికాగ!
కరుణింపుము! మురళీధర!

# మంచి శకున మాయెనంచు

మంచి శకున మాయెనంచు
మది పొంగుచుంటి చెలియ!

పాలపిట్ట పలుకు పలికె
పసవులెత్తె వనవీధిని!

మంచి శకున మాయెనంచు
మది పొంగుచుంటి చెలియ!

చిలుక జంట కొమ్మపైని
చేరి చేసె మధుర ధ్వనులు!
కల హంసలు కొలకునందు
కానిపించి మాయమాయె!

కాని కాలమందు పూచె
కలువపూలు కొలకులందు!
మబ్బులేని యాకాశము
మాధుర్యము పొలకబోసె!

పసుపు కుంకుమల తోడుత
బంగారపు నగలతోడ!
పసిపాపను నెత్తుకొనీ!
పడతి యొకతె యెదురాయెను!

ఆత్మ విభుని కలయికకై
అడలుచున్న నా హృదయము!
పూల తీవె చిఱుగాలికి
పులకరించి నటులాయెను!

## నీ మురళి రవములే!

నీ మురళి రవములే! నీ వేణు స్వరములే!
నా రాగ గీతాలు! నా గీతి భావాలు!

విశ్వ మోహనమైన
విమలమౌ నీ మురళి!
నా జీవనాడి గద!
నవ మోహనాంగా!

నీ మురళి రవములే! నీ వేణు స్వరములే!
నా రాగ గీతాలు! నా గీతి భావాలు!

పవలు రాత్రులయందు పలికినా పాడినా!
కలల యందునగూడ కలవరించిన గూడ!
నీ దివ్యస్వనములే నిత్యముగ వినిపించు!
నా మదిని పులకించు! నాట్యాలు చేయించు!

నీ మురళి నాదమే నీడగా వెన్నాడు
నాలోని భావాలు నవ్య గీతంబగును!
చెదిరినా భావాల చీకు చింతల దోలచి
ఉయ్యెలల నూగించు నుత్తేజ మొసరించు!

వేణు గాలియలచేత వెన్నాడు పూదీవె
కాంతి కలకలలాడి కదిలేటి రీతిగా!

నీ మురళి నాదమే
సినదించి నా మదిని!
పాటగా రూపొంది
పరవశంబై వెడలు!

నీ వేణు రవములే నీ వేణు స్వనములే
నా రాగ గీతాలు! నా గీతి భావాలు!

## ఆ పాట పాడరా !

ఆ పాట పాడవోయ్! యలరి గోపాలా!
ఆ మురళి నూదవోయ్! యందాలు చిందా!

గోప బాలురతోడి
గోవులను మేపుచూ!
తీయగా పాడినా
తేనె లొలికే పాట!

ఆ పాట పాడవోయ్! యలరిగోపాలా!
ఆ మురళి నూదవోయ్! యందాలు చిందా!

వ్రేపల్లె వాడలో వ్రేతకాంతల గూడి
రాస క్రీడలనాడు రమ్యమగు సమయమున!
భువన మోహనమైన మొలుపైన యాపాట
మబల నొకపరి పాడి మాధవా! కరుణింపు!

వయ్యారి గోపికల వలువలెత్తుకు పోయి
పొన్న చెట్టూ పైని పొలుపుగా గూర్చుండి!
మురళి పాటను, బాడి మోదమును వర్షింపు
ఆ పాట నొకసారి యాలపింపుము కృష్ణ!

ఆల గోపకుల గావ! ఆలమందల బ్రోవ!
కాళీయ సర్పమును గర్వమును హరియించి!

పాము పడగలపైని
పరగ నాట్యములతో
మురళి నూదిన పాట
మోదమున బాడవోయ్!

ఆ పాట పాడవోయ్! యలరి గోపాలా!
ఆ మురళి నూదవోయ్! యందాలు చిందా!

# ఎన్నాళ్ళాయెను ?

ఎన్నాళ్ళాయెను నీదు మురళి విని!
ఎన్నాళ్ళాయెను నిను కన్నుల గని!

వినిపింపుము! నీ వేణు గానమును!
కనిపింపుము! నా కనుల పండువుగ!

ఎన్నాళ్ళాయెను నీదు మురళి విని!
ఎన్నాళ్ళాయెను నిను కన్నుల గని!

మబ్బులు పట్టిన వాన కాలమున
మఱచితిగద! నీ మధుర గీతమును!
చంద్ర కాంతులూ, శారద రాత్రులు
మదిని నిలిపె నీ మధుర గీతమును!

మూగవోయినా మోహన రాగము
కదల సాగెనూ! గాలి తెరలుగా!
మధుర భావములు మంజుల గీతిగ
వెదల సాగెనూ! వేణు! నిను వెదుక!

మధుర భక్తితో మనసు విరిసెనూ!
వేయి రేకలా విమల కమలముగ!
పలుకుచున్న నా భావగీతమున
మురళీ రవముల ముద్దుగ కలుపుము!

కొసరి కోరికలు కోరుటలేదూ
ఆశను వరములు అడుగుటలేదూ!
భక్తి భావమూ బాంధవ్యమునూ
మదిలో నిలుపుము మాధవ! దయతో!

# మురళి నూదుచును

మురళి నూదుచును మోదముతో నా
పాటను వినుటే ప్రణయ భావమా?

రాగములో అనురాగము జిందుచు
అలరించుటయే ఆదరమా?

మురళి నూదుచును మోదముతో నా
పాటను వినుటే ప్రణయ భావమా!

మనసున నిలిచీ మర్మ వేదనల
మల్లెలు విరియుట అనురాగములా?
మోహా వల్లరుల ముంచి తేల్చుటది
మోసము కాదా గోపాలా?

మనసు పొరలి నీ మధుర ధ్యానమున
మసిలి పోవుటను గనలేవా?
కంటి నీరదే! కాలువ గట్టెను
కనికరమింతయు రాదేలా?

జన్మ జన్మలా కోరిక దీర్చుము
సరస గోపికను! సఖియను స్వామీ!
అన్ని నీవనుచు నాలపించు నా
సన్నుతి విని నీ సన్నిధి జేర్చుము!

రంగులు చెరిగిన చిత్రములా నా
రమ్యత లన్నియు చెదిరెను కృష్ణా!
శిథిల శిల్పముగ యుంటిని నే భువి
చేర్చుము! నీ పద కమలములందూ!

# వెన్నెల తీవెలు

వెన్నెల తీవెలు విరిసెను మదిలో
వేయిరేకలా విరిసిన పూవుగ!

సన్నని నీ మురళీరవ ధ్వనులే
కన్నె వలపులను చిలికెను మదిలో!

వెన్నెల తీవెలు విరిసెను మదిలో
వేయిరేకలా విరిసిన పూవుగ

మధుర భావ మేదో మనసున తొలికీ
తీయని రాగము తెరలు తెరలుగా!
విమల గీతముగ వేడుచు నీకై
పరవశించు మది ప్రార్థన వినవా?

కదలని దీపపు కాంతిరేఖలా!
దారిని జూచుచు దయ గనుగొనుమని!
నీలో కలియగ నిలిచిన దాసిని
కరుణ జూపగా కపటమెందుకో!

మబ్బుల తొలికే మధుర సంధ్యలా
కొమ్మచాటునా కోకిల స్వరముగ!
కలతజెందు నా కాంక్ష దీర్చరా!
తరతరాలదీ విడని బంధమూ!

యుగ యుగాలవీ మురళీ స్వనములు
జగ జగాల దీ భావ గీతమును!
చెదిరిన మన యీ లయ తాళములను
చేరువ జేర్చుము ఏక నాదముగ!

# నేనే నీవని నీవే నేనని

నేనే నీవని నీవే నేనని
మది భావించితి మధురముగా!

వేధింపకు నను బాధింపకురా!
విడి వడి నన్నిటు గోపాలా!

నేనే నీవని నీవే నేనని
మది భావించితి గోపాలా!

చిగురాకులకును చిన్ని పువ్వులకు
చిత్రమైన యే స్నేహము గలదో!
కలకాలపు దీ స్నేహబంధమూ!
కలగా జేయకు గోపాలా!

నే నెవరిని యని నే నెవరిని యని
యడిగితి హృదినీ యనురాగముతో
కోటి కోటి నీ మురళీ రవముల
కోమలమగు నొక స్వనమని దెలిసితి!

ఎంతకాల మిటు వేచి జేసినా
ఎంత దూరమున నున్ననుగానీ!
నిన్నే వెదుకుదు! నిన్నే పాడుదు!
నీ మురళీ స్వనములలో మునుగుదు!

మారని, మరువని మనసది నాదీ!
వీడని విడువని బంధము నాదీ!
కిన్నెర మీటుచు గిరుల దాటుచూ
నిన్నే కలియగ నిఖిలము దిరుగుదు!

# గీర వడినదో! గీత వడినదో!

గీర పడినదో! గీత వడినదో!
కంఠము పెగులదు కమనీయముగా!

మనసున గల యా మధుర భావనలు
మాడి పింజలుగ దూరముగా జనె!

గీర వడినదో! గీత వడినదో!
కంఠము పెగులదు! కమనీయముగా!

పలికి పలికి నీ మధుర నామమును
పలవరింతగా మారెను గాదా!
చూచి చూచి నీరాకను గోరుచు
చూడ్కులు నిలిచెను చిత్రముగా!

మధుర గీతములు మాసిపోయినవి
మనసు చీకటిని మసిలి పోయినది!
కాలిగజ్జెలెటు కదులును యికపై
కలసి నర్తనెటు చేయుదునోయీ!

ఆకురాలు ఈ శిశిర కాలమున
అంద మెటుల కనబఱతును కృష్ణా!
కాని కాలమున కలువ పూవులను
కానికలను నర్పించెద నోయీ!

చెదిరిన మనసును జిక్కపట్టుకొని
జేర్చితిని యీ మధుర గీతమును!
స్వీకరింపుమా! మధుర వేదనను
చేర్చి పాడుమా! మురళీ స్వనముల!

## పిలిచిన పలుకని

పిలిచిన పలుకని ప్రేమలెందుకో!
వలచిన రానీ వలపు లెందుకో!

భక్తిమీర నిను ప్రార్థన జేసిన
రక్తిని జూడని రవళు లెందుకో!

పిలిచిన పలుకని ప్రేమలెందుకో!
వలచిన రానీ వలపులెందుకో!

చిలుక పలికినటు చిత్రముగా నిను
చిన్ని మాటలను జేర బిలిచితిని!
కరుణజూపి నా కాంక్షను దీర్పను!
తీయని మాటల దేల్పవుగా!

ఉభయ సంధ్యలను మరి సంధ్యలలో
'ఓ నాథా!' యని యొప్పుగ బిలిచితి!
వన్నెల జిందవు! వలపుల జూపవు!
ముద్దులు జిందే మోమును జూపవు!

అడలుచున్న నా యంతరాత్మనూ
అంతరంగమున జేర్చుకొనుమోయి!
నీ మురళీ స్వనములలో గలియగ
నిలిచిన దాసిని గోపాలా!

గానముతో నను కనికరింతువని
కలలను గంటిని గోపాలా!
కోకిలవలె నే కోదిగీతముల
కొసరి పాడినా దయగనవేలా?

# నా మదిలోగల మర్మ వేదనలు

నా మదిలో గల మర్మ వేదనలు
నర్మముగా నెటు దెలుపుదునూ! కృష్ణ!

గాలికి కదిలే పూవుల రెమ్మల
కమ్మగ పాడే కోకిల నడుగుము!

నా మదిలో గల మర్మ వేదనలు
నర్మముగా నెటు దెలుపుదునూ! కృష్ణ!

మధు వసంతమును మలయానిలమును
కొలనిగట్టు గురివింద పొదలనూ!
వికసించిన యీ కలువ పూవులను!
విప్పారిన యా పద్మము నడుగుము!

చల్లని జాబిలి వెన్నెల రేకల!
జాలువారు సెలయేటి ధారలను!
మల్లియ తీగెను మాలతి లతనూ!
నిలిచిన తరువుల నీడల నడుగుము!

పిలిచిన నామది పిలుపులవెన్నో
కంటి నీ రెటుల కాలువలాయెనో!
గరిక పూలపై కాంతులు చిందే!
మంచు బిందువులు మర్మము దెలుపును!

అడిగిన కోరిక చిన్నది గాదా?
అతివను గద! నీ చరణ దాసినీ!
కనికర మింతయు గానరాదుగా!
కరుణామయ! నీ సన్నిధి జేర్పుము !

# నీ మధురామృత

నీ మధురామృత మురళీ రవముల
నీ సుందర సుకుమార మూర్తితో!

మునిగి తేలగా మోదమునందగ
యందింపర నీ యనురాగములను!

నీ మధురామృత మురళీ రవముల
నీ సుందర సుకుమార మూర్తితో!

చల్లని చూపుల జల్లులు గురియుము!
ఉల్లము పెల్లున పొంగులారగా!
వనమయూరినై వన్నెల జిందుచు
నర్తన జేసెద నవభంగిమములను!

నింగి నీలిపై నెలవంక వుగ్గా
వెండి తీగెలసు వేడుక విరియుము!
తారగ వెలసి తన్మయ మందగ
నీ సమీపమున నిలిచెద మిలమిల!

నీ నా పాటలు ఒకటయిపోవగ
నీ పాటను నేనొదిగి పోవగా!
నా జీవము నీ మధుర వాహినిని
నాథ! దయగొనుము! చిఱుకెరటముగా!

నీ మధురామృత మురళీరవముల
నీ సుందర సుకుమార మూర్తిలో!

# అంతులేని యీ పయనం

అంతులేని యీ పయన మెచటికో!
అంతములేని గమన మెచటికో!

ఆటుపోటులా యలజడి చక్రము
ఆగి పోవుటది యెన్ని నాళ్ళకో!

అంతులేని యీ పయన మెచటికో!
అంతములేని గమన మెచటికో!

మధుర గీతములు మంజుల భావన!
మణిగి పోవుటది యెన్నటికో గద!
చీకటి విరిగీ చిఱుకాంతులలో
చిత్తము గలియుట యెన్ని నాళ్ళకో!

కొండ కోనలను కోకిల దాపుల
వెంట్రదిప్పుచిటు వేడుక యేమో!
విరహ గీతమును విను గోరికయో!
కంటిధారలను గన సంబరమో!

ఎన్ని పదములల్లి జేర్చినగానీ!
కన్న! నీగీతి పూర్తికాదుగా!
ఎన్ని భావములు గూర్చిన గానీ
చిన్న భావమేదొ మిగిలియుండునూ!

అంతులేని యీ పయనము నాపుము!
అంతములేనీ గమనము నాపుము!
చింత దీర్చి నా శిరమున మురళిని
చేర్చి సుఖము నీయుము గోపాలా!

## అంజలితో

అంజలితో నీ వాకిలి నిలిచి
అర్పించితి నా హృదయ కుసుమమును!

కిన్నెర మీటుచు కీర్తన బాడుచు!
కన్నె మనసు నీ కర్పణజేసితి!

అంజలితో నీవాకిలి నిలిచీ
అర్పించింది నా హృదయ కుసుమను!

విరహరాత్రు లిటు లెన్ని దొరలినా!
తరతరాలిటుల తరలిపోయినా!
మనసెందుకు నిను మఱచిపోవదో!
మమత స్నేహములు మాయముకావో!

చిన్ని పూవులూ! చెట్ల నీడలూ!
చల్లని జాబిలి వన్నెల రేకలు!
అణువణువును నీ యఖిల ప్రపంచము
నీయనురాగపు నిలయములే కద!

మధురగీతమును మంజుల నర్తన
మనసు వేదనను మన్నన జేయుము!
నాథ! నీ మనసు నవనీతముగద!
అలసట దీర్చి యాదరింపరా!

అంజలితో నీ వాకిలి నిలిచీ
అర్పించితి నా హృదయ కుసుమమును!

# నీ దరి జేరగ

నీ దరి జేరగ నిను నే గలియగ
నిండు ప్రేమలను నీడ జూపితివి!

సఖియల గూర్చి చల్లని ప్రేమల
గమ్యము జేరగ కనికరించితివి!

నీ దరి జేరగ నిను నే గలియగ
నిండు ప్రేమలను నీడ జూపితివి!

చిగురులు పువ్వులు చిన్ని రెమ్మలూ
కొండలు కోనలు కోకిల స్వనములు!
నా కొఱకే గద! నవ నవ జ్యోత్స్నలు
నిర్మల ప్రేమను నిర్మించితివి!

జల జల పారే సెలయేఱులనూ
ఝిల ఝిల కదిలే తరు లతాదులను!
నిండిన తారల నీలాకాశము
విరహ గీతమును వేడుక నిచ్చితి!

నీ యపార కరుణామృత రసమును
నిలుపలేను నే నోపజాలనూ!
కిన్నెర నిచ్చితి కీర్తన బాడగ
మధువును జిందే మనసు నిచ్చితివి!

తేనెలు చిందే తెనుగు బాసతో
తీయని పదముల నల్ల నేర్పితివి!
భక్తి భావమున భగవంతా నీ
పదముల జేరగ దారి జూపితివి!

# మధుర వసంతము

మధుర వసంతము విరిసే వేళను
మంజుల స్వరమున కోకిల పాడును!

నా మది లోపల నవ గీతము లవి
యన్ని ఋతువులను నలరారును గద!

మధుర వసంతము విరిసే వేళను
మంజుల స్వరమున కోకిల పాడును!

నీలి మేఘమును గనుగొని నపుడే
నెమ్మి నర్తకిగ నృత్యము సేయును!
నా మన సెపుడును నన్ని వేళలను
నాట్యమాడు టిది యేమి చిత్రమో!

కాషాయాంబర కనక రేఖలను
తొలి మలి సంధ్యల దేలును ప్రకృతి!
నా మదిలో నవ రంగుల శోభలు
ప్రతి నిముసమునూ పల్లవించునూ!

అంతులేని నీ యాదరమే కద!
అంతరంగమున నిలుచుటయే కద!
చల్లని నీ మురళీ స్వనములచే
ఉల్లము కిన్నెరగా మారినది!

మధుర వసంతము విరిసే వేళను!
మంజుల స్వరమున కోకిల పాడును!

## ఎన్ని జన్మలిటు

ఎన్ని జన్మ లిటు వెత గలిగించెదొ!
ఎన్ని యుగము లిటు వెంట ద్రిప్పెదవొ!

నీ మురళీ స్వనములలో గలియగ
నిలిచెడి దాసిగ సృజియించెదవో!

ఎన్ని జన్మలిటు వెత గలిగించెదో!
ఎన్ని యుగము లిటు వెంట త్రిప్పెదవొ!

కొండ కోనలను కొలకుల దరులను
చిగురుల పూవుల చెట్ల నీడలను!
తారలు నిండిన తరగని రాత్రుల
వేణువుతో విలపింప జేసెదో !

నీ మురళీ స్వనముల వినిపించీ
నీ ప్రేమామృతముల కురిపించీ!
వెంట ద్రిప్పెదవు! వేయి నగరులను
కంటి కందపూ! కలత దీర్పవూ!

అంజలితో నే నలమటించుటలు
కంటి నీటితో కలత బొందుటలు;
చాలు! చాలు! యిక చల్లని హృదిలో!
స్థానము నిమ్మా! సారసనయనా!

ఎన్ని జన్మ లిటు వెత గలిగించెదొ!
ఎన్ని యుగము లిటు వెంట ద్రిప్పెదవొ;

# అఖిల విశ్వమున

అఖిల విశ్వమున యలరెడి స్వామివి!
అంతరంగమున యలరితివీ!

చిన్ని కృష్ణునిగ జేసి మధురముగ
చిఱువేణువు నందించితినీ!

అఖిల విశ్వమున యలరెడి స్వామివి!
అంతరంగమున యలరితివీ!

నీ మురళీ స్వనములలో దేలుచు
నఖిలమునంతను నే మఱచితినీ!
పాట పాడుచూ నాట్యమాడుచును
పారవశ్యమున మునిగి తేలితిని!

భావనతో నిను పల్లవి జేసీ
పాట పాడితిని రాగము తోడను!
గీతము తోపల గిరులుగీసి నిను
భావము నందున బంధించితినీ!

విడవడ రానిది వేఱు బడనిదీ!
తరతరాల దీ తరగని బంధము!
నీ మురళీ స్వనములలో నన్నిక
నిలుపుకొనుమోయి నీరజ వదనా!

అంతవాడ విటు నింత వాడవై
చిన్ని మనసునను జేరిపోతివీ!
ఎదలో విరిసిన భావగీతమున
మమతను యొదిగీ నిలిచి పోతివీ!

# క్రొత్త పాటలు

క్రొత్త పాటలు పాడమంటావు! కృష్ణ!
క్రొత్తరాగము తీయమంటావూ!

మురళి పాటకు దగిన ముద్దు ముచ్చటయైన
మధుర పదములు గూర్చమంటావు! కృష్ణ!
మధురిమల నొలికింప మంటావు !

చివురాకులను దిన్న చిన్ని కోయిల మళ్లె
వనమంత తిరుగుతూ వన్నె జిందేటట్లు!
నవ రాగములు తీయ మంటావు! కృష్ణ!
నవ గీతి వినిపింప మంటావు!

పువు దేనియలు ద్రావి పుప్పొడులు మేసినా
తుమ్మెదల గుంపులా తూలుతూ సోలుతూ!
తెలుగు పాటలు పాడమంటావు! కృష్ణ
తీపి పద మొలికింప మంటావు!

నా పాట నే నెప్పుడో నాడె మఱచితినోయి!
నీ మురళి స్వనములను వినిచిపోతిని గదా!
అన్ని మఱచిన నన్ను అనబెట్టకు స్వామి!
ముద్దుసేయర! నాదు మోహనంబగు కోర్కె

క్రొత్తపాటలు పాడమంటావు! కృష్ణ!
క్రొత్త రాగము తీయమంటావు!

# నీ మురళీ స్వనములు

నీ మురళీ స్వనములు వినుటకె గద!
నింగి నీల మటు నిలిచెను కృష్ణా!

అణువణువును నీ యఖిల ప్రపంచము
కలతబొందుటను గనలేవా? కృష్ణ!

నీ మురళీ స్వనములు వినుటకె గద!
నింగి నీల మటు నిలిచెను కృష్ణా!

పన్నెల పువ్వులు చిన్నెల రెమ్మలు
కన్నె ప్రకృతిటు గలత జెందుటను !
కంటి నీరుగా హిమ బిందువులను
కాలువ గట్టుట నీ కొఱకేగద!

చంద్ర రేఖ యిటు జన్మ లెత్తుటను
మధుర వసంతము మఱల వచ్చుటను
యుగయుగా లిటుల దొరలి వచ్చుటను
నీ మురళీ ధ్వని జేరుటకే గద !

కిన్నెర మీటుచు కీర్తన బాడుచు
కదిలి పోయె నా గత జీవితములు!
ఎన్నడు నీ కృప విరులురాలునో!
ఎన్నడు నీ దయ జాలు వారునో!

తీయని నీ మురళీ స్వనములతో
తీరుగ కలిసే సుదిన మెన్నడో!
లయ తాళములను రాగరీతితో
లయము జెందుటది యెన్నటికో గద!

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ గ్రంథాలయ సంస్థ వారి అనుమతి పొందినవి.

| | | | |
|---|---|---|---|
| | 2268 తె 800 1484 | | |
| 1. | నాలో వెలిగే దీపాలు | బాలసాహిత్యం | 0-50 |
| | 2269 తె 800 1485 | | |
| 2. | విజయ మంగళం | (గీతములు) | 4-00 |
| | 2270 తె 800 1486 | | |
| 3. | అందరికీ నచ్చిన కోడలు | (నాటిక) | 2-00 |
| | 2909 తె 800 1892 | | |
| 4. | ఉత్తర గోగ్రహణము | (నాటిక) | 2-00 |
| | 3649 తె 700 35 | | |
| 5. | శ్రీ కందుకూరి: శ్రీ సరోజినీదేవి | (బుర్రకథలు) | 2-00 |
| | 3756 తె 800 2444 | | |
| 6. | ఆనంద మంగళం | (లలిత గీతాలు) | 4-00 |
| | 3757 తె 800 2445 | | |
| 7. | నాట్యశాల | (నాటిక) | 4-00 |
| | 4560 800 3026 | | |
| 8. | గోపబాలక శతకము | (పద్యములు) | 1-50 |
| | 4561 800 3027 | | |
| 9. | భూమితల్లి బిడ్డలు | (నాటిక) | 2-50 |
| | 6622 తె 800 4551 | | |
| 10. | పాలేటి తరగల్లో మల్లి | (పాటలు) | 5-00 |
| | 6623 తె 800 4552 | | |
| 11. | వీధి దీపం | (కవితలు) | 4-00 |
| | 6624 తె 800 680 | | |
| 12. | వినయాంజలి | (కవితలు) | 4-00 |
| | 6936 తె 200 680 | | |
| 13. | శ్రీ రామచంద్ర సుధ | (పాటలు) | 4-00 |
| | 7037 తె 800 4834 | | |
| 14. | ఝాన్సీరాణి | (బుర్రకథ) | 2-50 |

7462 తె 800 5129

15. కృష్ణదాసి (లలిత గీతాలు) 4—00
8964/తె 800 5933

16. చిగురులు-పువ్వులు (గేయములు) 4—00
8965 తె 800 5934

17. పాలేటి తరగల్లో పల్లి (పాటలు) 5—00
8966 తె 800 5935

18. శోణ పద్మం (నాటిక) 3—00
8967 తె 800 5936

19. హరిదాసు (పాటలు) 2—00
8991 తె 800 5514

20. పూలరథం (గేయములు) 4—00
9698 తె 900 572

21. శ్రీ అల్లూరి (బుర్రకథ) 3—00
10035 తె 800 6768

22. ప్రతిధ్వనులు (వచన కవిత) 4—00
11028 తె 800/7349

23. గోదాదేవి పాటలు (పాటలు) 2—00
11679 తె 800 7794

24. గిరిజా కళ్యాణము (ద్విపద) 10—0
12686 తె 800 8429

25. ఎఱ్ఱనపోతనల కవితామాధుర్యము (తులనాత్మక పరిశీలన) 10—0
2517 తె 800 425

26. మౌనగీతాలు (లలిత గీతాలు) 5—0

నూతన ప్రచురణలు

27. కన్నీటి పువ్వులు 8—0

28. శాంతిగీతం (ముత్యాల సరాలు) 6—0

29. మురళీ స్వనాలు 8—0

30. మధుర గోపిక (లలిత గీతాలు) 8—0